

# ప్రజారాజ్యం

(తెలంగాణా స్వాతంత్ర్యోద్యమం)

దీర్ఘకావ్యం

151/2-90





డాక్టర్ రావికంటి వసునందన్

# ప్రజా విజయం

## (తెలంగాణా స్వాతంత్ర్యోద్యమం)

రేడియో రూపకం

[ ఆకాశవాణి హైదరాబాద్ సౌజన్యంతో ]



డాక్టర్ రావికంటి వసునందన్



PRAJA VIJAYAM
(Radio Play)
by
Dr. R. VASUNANDAN
M. A., Ph. D.,
Head Dept of Telugu Studies,
A. P. Open University. Hyderabad.





Publication No. 12

Title Design : CHANDRA

Five Rupees

For Copies
VISALAANDHRA PUBLISHING HOUSE
4-1-435, Vignana Bhavan,
Bank Street, Hyderabad-500 001.

Printed at
MASTER PRINTS
1-1-581, Gandhinagar,
Hyderabad 500 380



ప్రముఖ సంఘసేవిక

వాత్సల్యమూర్తి

## శ్రీమతి ఖాదం సరోజాదేవి రామస్వామిగారికి

12.05.1990 షష్ట్యబ్ది జన్మదిన సందర్భంగా

# మనవి

"స్వాతంత్ర్యోద్యమంలో ఆంధ్రప్రదేశ్ పాత్ర – తెలంగాణాలో స్వాతంత్ర్యోద్యమం" అన్న శీర్షిక క్రింద అరగంట రేడియో రూపకంగా 24-02-1987 రోజున హైదరాబాద్ కేంద్రంనుండి ఈ రచనను ప్రసారం చేసి, ఈ గ్రంథ ముద్రణకు అనుమతించిన ఆకాశవాణి అధికారులకూ

ఈ రచనకు ప్రేరేపించిన మిత్రులు శ్రీ ఆట్లూరి వెంకట్రావు చౌదరి గారికీ, నిర్వహించిన 'సుధామ'కూ, వ్యాఖ్యానం చేసిన శ్రీమతి జ్యోత్స్నకూ

## కృతజ్ఞతలు

మొదటిసారిగా ఈ రూపకంలోని పాత్రలు ధరించి, సమర్థవంతంగా పోషించిన శ్రీయుతులు జి.జె. రవివర్మ, ఇలియాస్ అహ్మద్, ఎన్. వి. ఎస్. రామారావు, కె. ఎఫ్. జె. విద్యాలంకార్, కళాకృష్ణ, కపర్ది, మంత్రవాది మహేశ్వర్, ముక్కపూడి భాస్కరరావు, జగన్మోహన్, చావలి దేవదాస్, ఎం. సుధాకర్, ఆనంద్‌స్వామి ప్రభృతులకు

హృదయపూర్వక శుభాభినందనలు

రావికంటి వసునందన్

# ప్రజా విజయం
(రేడియో రూపకం)

నిర్వహణ :
శ్రీ సుధామ

వ్యాఖ్యానం :
శ్రీమతి జ్యోత్స్న

పాత్రలు : కిర్క్‌పాట్రిక్ : బ్రిటిష్ రెసిడెంట్.
సికిందర్ జాహ్ నిజామ్ : హైదరాబాద్ మూడవ నిజాం.
మీర్ ఆలం : సికిందర్ జాహ్ ప్రధాని.
మహీపతిరామ్ : బీరార్ గవర్నర్.
పట్వారి : ప్రముఖుడు.
వామన్‌నాయక్ : ప్రముఖుడు.
శాస్త్రి : ప్రముఖుడు.
హాజీ కర్రాన్ : షౌకతుల్ ఇస్లాం పత్రికసంపాదకుడు.
సర్ అక్బర్ హైదరి : హైదరాబాద్ ప్రధాని.
గోవిందరావ్ నానల్ : స్టేట్ కాంగ్రెస్ కార్యాచరణ అధ్యక్షుడు
రామానంద తీర్థ : స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షుడు
బూర్గుల రామకృష్ణారావు : ప్రముఖుడు.
శంకర్‌రావ్‌దేవ్ : అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి.
శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ : సోషలిస్ట్ పార్టీ ప్రతినిధి.
ఎన్. జి. రంగా : ప్రముఖుడు.
గూడపాటి రామచంద్రరావు: ప్రముఖుడు.

ఇంకా—అక్బర్ హైదరీ పి.ఏ, కొందరు రాజభటులు, పోలీసులు, పోలీస్ కమీషనర్, వందిమాగధులు, కొందరు ప్రజలు, బృందగీత బృందం.

# ప్రజా విజయం

SCENE : 1

**కథకుడు :-** వినరా భారత వీరకుమారా ! విజయశౌర్యయాత్ర

**వంతలు :-** తందానతాన.

**కథ :-** వినరా భారత వీరకుమారా ! విజయ శౌర్యయాత్ర

**వంత :-** తందానతాన

**కథ :-** స్వాతంత్ర్యోద్యమ యజ్ఞదీక్షలో తెలంగాణ పాత్ర.

**వంత :-** తందాన తాన

**కథ :-** స్వాతంత్ర్యోద్యమ యజ్ఞ దీక్షలో తెలంగాణ పాత్ర

**వంత :-** తందానతాన —తా తకిటతరి తరికిట జంతరితా

(తెర)

## వ్యాఖ్యానం

భారతజాతి నరనరాలనూ నల్లమందులా పట్టిపీడించి, పీల్చి పిప్పిచేసిన తెల్లదొరల దురధికారానికి చిక్కిన ఒక భారతీయ సంస్థానాధీశ్వరుడు. హైదరాబాద్ రాజధానిగా దక్కన్ ప్రాంతాన్ని పరిపాలిస్తున్న నిజామలీ ఖాన్. ఆసఫ్‌జాహీ వంశంలో రెండో నిజామ్ ఇతడు. తన రక్షణ కోసం ఈస్టిండియా కంపెనీతో క్రి. శ. 1800, అక్టోబర్ 12 వతేదీన ఒక సైనిక సంధిని చేసుకొని హైదరాబాద్ సంస్థానాన్ని పారతంత్ర్యం పాలుచేశాడు. ఈ దాస్యవిముక్తికి తెలంగాణా జరిపిన స్వాతంత్ర్య పోరాటం రెండుదిశలుగా సాగింది. బ్రిటిష్ తొత్తుగా మారిన నిజామ్ పాలనలోని ప్రజలూ, పరిపాలకులూ ఆంగ్లేయులపై జరిపిన సాయుధ విప్లవం వాటిలో మొదటిదిశ. హైదరాబాద్ నేటివ్ స్టేట్ ఇండియన్ యూనియన్‌లో కలసిపోవాలని దేశంలోని ప్రముఖులూ, సంఘసంస్కర్తలూ, దేశభక్తులూ చేసిన శాంతియుత నినాదం రెండోదిశ. తెలుగువారి భాషాసాహిత్య సాంస్కృతిక రంగాలకు పరిపుష్టి చేకూర్చడానికి తెలంగాణాలో జరిగిన ప్రయత్నం రెండోదిశలో అంతర్వాహిని. ఈ అన్నిటినీ తనలో కలుపుకుంటూ, జాతీయతనూ దేశీయతనూ నిలుపుకునే దీక్షతో ద్విముఖంగా పురోగమించింది తెలంగాణా స్వాతంత్ర్యోద్యమం. ఈ ప్రయత్న పరంపరలో మూడవ నిజామ్ సికిందర్ జాహ్ కాలంలో తొలిసారిగా విప్లవించిన హైదరాబాద్ సంస్థాన స్వాతంత్ర్యత సమర యోధుడు బీరార్ గవర్నర్ రాజా మహీపతిరామ్.

**(Music Bits)**

# సికిందర్‌జాహ్ సభ దృశ్యం

(సర్దారులూ, రాజోద్యోగులూ, ఆంగ్లేయులూ కూర్చుని ఉంటారు)
(కొమ్ముబూరలు ఊదిన శబ్దాలు)
(అంతా లేచి నిలబడతారు)

వందిమాగధులు: ఆలాహజరత్। మాబదౌలత్।
బందాపర్వర్। సికిందర్‌జాహ్ నిజామ్
దర్బార్‌మేఁ తష్రీఫ్ లారహే హైఁ।
బాఅదబ్ బాములాహెజా హోషియార్।
బాఅదబ్ బాములాహెజా హోషియార్।
బాఅదబ్ బాములాహెజా హోషియార్।

(నిజాం ప్రవేశం. ఆతడు సింహాసనంమీద కూర్చున్న తర్వాత అంతా కూర్చుంటారు)

కిర్క్‌ప్యాట్రిక్: (లేచి నిలబడి) లాంగ్‌లివ్ బ్రిటిష్ ఎంపైర్। గుడ్‌మార్నింగ్ సికిందర్‌జాహ్ నిజామ్।

నిజాం: గుడ్‌మార్నింగ్ బ్రిటిష్ రెసిడెంట్ కిర్క్‌ప్యాట్రిక్ సాహెబ్। వెరీగుడ్ మార్నింగ్।

మీర్ ఆలం: (వంగి సలాములు చేస్తూ) ఆదాబ్‌హుజూర్ నిజాం సాహెబ్ । ఆదాబ్ ।

నిజాం: వజీరె ఆలా మీర్ ఆలం । ఏమిటి ఈ రోజు మన దర్బార్ కార్యక్రమాలు ?

మీర్ ఆలం: జహాఁపనా ! రాజద్రోహం చేసిన బీరార్ సుబేదార్ మహీపతి రాంను బంధించి తెచ్చాడు బ్రిటిష్ కమాండర్ విలియం పామర్. హుజూర్ వారి సెలవైతే...,

నిజాం: ప్రవేశపెట్టండి.
(మనిషి నడుస్తుండగా గొలుసులు, సంకెళ్ళు చేసే శబ్దాలు Sound effects)

విలియం పామర్ : గుడ్‌మార్నింగ్ నిజామ్ సాహెబ్ ! ఇదిగో రాజద్రోహి మహీపత్‌రామ్.

కిర్క్‌ప్యాట్రిక్ : వెల్‌డన్ కమాండర్ విలియం పామర్ ! వెల్‌డన్! ఈ ద్రోహికి తగిన శిక్ష విధించండి నిజామ్‌సాహెబ్!

మహీపతిరామ్ (తీవ్రస్వరంతో) : ద్రోహి !! ఎవడురా ద్రోహి? నక్క వినయాలతో మా రాజదర్బారుల్లో ప్రవేశించి దేశసౌభాగ్యాన్ని దోచుకు తింటూ, మా సంస్థానాధీశుల్లో అంతఃకలహాలు రేపి, విభజించి పాలించే మీరు ద్రోహులు. రక్షణ పేరుతో మా ప్రభువుల పంచనజేరి వంచనతో వెన్ను పోటు పొడుస్తున్న మీరే భారతదేశ ద్రోహులు.

మీర్ ఆలం : ఖామోష్ మహీపతిరామ్! ఇంకొక్క మాట మాట్లాడావంటే ఖబర్దార్.

మహీపతి : ఏం? ఏం చేస్తావ్ మీర్ ఆలం? ఉన్నమాటంటే అంత పౌరుషం పొడుచుకొచ్చిందా? లేక ఈ బ్రిటిష్ రెసిడెంట్ ఆగ్రహిస్తే నీ పదవి కాస్తా ఊడిపోతుందని దడుపు పుట్టిందా? పిరికి పంద!

ప్యాట్రిక్ : హోల్డ్ యువర్‌టంగ్ మహీపత్‌రామ్! మీ నిజామ్ రక్షణ కోసమే కదా మేము బొల్లారం, మల్కాజ్‌గిరి ప్రాంతాల్లో సుశిక్షితులైన బ్రిటిష్ సైనిక వీరయోధులతో హైదరాబాద్ కంటింజెంట్ ఏర్పాటు చేశాము? ఆ కట్టుదిట్టాలను చెల్లాచెదరు చేసి మీ రాజుకు అపాయం కొని తెచ్చే ద్రోహబుద్ధితో ఉన్న విప్లవ కారుడివి నువ్వు. నీ ముస్లిం సైన్యాలకు ఫ్రెంచ్ జనరల్ లార్డ్ రేమాండ్‌తో ప్రత్యేక శిక్షణ ఇప్పించి, వారిలో ప్రభుత్వ ధిక్కార బుద్ధి కలిగించి, బ్రిటిష్ సోల్జర్లపై తిరుగుబాటు చేయించి, ఈ సైనిక విప్లవం తెప్పించావు. గవర్నర్ జనరల్ లార్డ్ వెల్లస్లీతో మీ సంస్థానం చేసుకున్న సైనిక సంధి షరతులను విచ్ఛిన్నం చేయడానికి ప్రయత్నించావు. రక్షణ ఏర్పాట్లను కూలదోసి సికిందర్ జాహ్ నిజామ్ వారికే తీరని అపచారం తలపెట్టావు. ఈ ద్రోహానికి తగినశిక్ష నీకు తప్పదు.

మీర్ ఆలం : ఆప్‌నే ఠీక్ కహా కిర్క్ ప్యాట్రిక్ సాహెబ్! మహీపతిరాం! కన్నూ మిన్నూ కానని కండకావరంతో నిజామ్ సికిందర్ జాహ్ హుజూర్ వారికే ద్రోహం చేసిన నిన్ను ఖతమ్ చేస్తామ్.

మహీపతి : చుప్ రహో బ్రిటిష్ గులాం మీర్ ఆలం ! ప్రజా సంక్షేమాన్ని సమూలంగా పెకలించివేసే సైనిక సంధిని పాటించే ఈ నిజామ్‌ను ఎదిరించక ఏం చేయాలి ? ఈ సైనిక సంధి నియమాల ద్వారా గాని, మన కొలువులో శాశ్వతంగా పాతుకుపోయిన ఈ బ్రిటిష్ రెసిడెంట్ నియామకం ద్వారా గాని ఈ సంస్థానానికీ నాదేశ ప్రజలకూ జరిగిన మేలేమిటి? ఈ దేశం సొత్తునే పీకలదాకా మెక్కి ఇక్కడి ప్రజల మీదనే, మన సైనికుల మీదనే జులుం చెలాయిస్తున్నారు బ్రిటిష్ సోల్జర్స్. కనపడ టంలేదా ? ఆర్థిక, రాజకీయ, పరిపాలనా వ్యవహారాలన్నిటిలోనూ వేలు పెడుతున్నాడీ రెసిడెంట్. అంతే కాదు—సంస్థానంలోని అతి ముఖ్య రాజ్యాంగ వ్యక్తివైన నీ వంటి వాని ప్రధాన మంత్రి పదవీ నియామ కానికి సంబంధించిన సర్వాధికారాలను కూడా చేజిక్కించుకొని ఈ నిజామ్‌ను కీలు బొమ్మను చేసి ఆడిస్తున్నాడు. ఇక ఈ సంస్థానంలో నిజామ్ అధికార మేమున్నది? రక్షణ ఏమున్నది ? స్వదేశీయ పరిపాలన మేమున్నది ?

నిజాం : మహీపత్‌రామ్ ! ప్రభువులం మేమిక్కడున్నామన్న విషయం కూడా మరచి ఒళ్ళు తెలియకుండా నీ యిష్టం వచ్చినట్టు వదరుతున్నావ్. నిన్ను క్షమించేది లేదు. మా దివాన్ మీర్ ఆలం స్థానాన్ని ఆక్రమించుకోవాలని నీవు ఎత్తు వేయడం లేదా ? మా సుబేదార్‌వై ఉండి మా అనుమతి లేకుండా మహారాష్ట్ర ప్రభువులు హోల్కార్ సింధియాలతో కలిసి బ్రిటిష్ సైన్యాలనూ, రెసిడెంట్‌నూ ఈ రాజ్యం నుండే తరిమి వేయా లని కుట్ర చేయలేదా? నీ మీద మేమే స్వయంగా చేస్తున్న ఈ ఆరో పణలకు నీ సంజాయిషీ ఏమిటి ?

మహీపతి : మీ రన్నది నిజమే. కాని, ఇదంతా చేసింది నా కోసం కాదు. నా విప్లవం నా దేశ ప్రగతి కోసం. నా తిరుగుబాటు నా ప్రజల సంక్షేమానికి. మన సొమ్ము తింటూ మన ప్రజలనే ఉక్కు ముక్కలతో పొడిచి చిత్ర వధలు చేస్తున్న ఈ తెల్ల కాకులను తరిమి వేయడానికే ఆ పని చేశాను. జాతీయతనూ, దేశీయతనూ, సంస్థాన సంప్రదాయాలనూ, ప్రజల మాన ప్రాణాలనూ మంట గలుపుతున్న ఈ ఆంగ్లేయుల దౌర్జన్యాన్ని అంతం చేయడానికే ప్రయత్నించాను. ఇందులో నా స్వార్థం కానీ, మీకు నేను చేసిన ద్రోహం కానీ ఆవంతైనా లేదు నిజామ్.

నిజాం : మహీపతిరామ్! మా కొలువులోని ఒక ఉద్యోగివి నీవు. కారణం ఏదైనా మా అభిమతానికి విరుద్ధంగా నీవు చేసిన ప్రతి చర్యకూ నీవు శిక్షార్హుడివే. అంతరంగికంగా మా దివాన్‌లతో చర్చించి, రేపు నీకు దండన విధిస్తాం. కమాండర్ విలియం పామర్! ప్రస్తుతానికి ఇతణ్ణి తీసుకుపోయి మీ గస్తీలోనే బంధించి ఉంచండి.

పామర్ : వెరీవెల్ సికిందర్ జాహ్ నిజామ్!

కిర్క్ పాట్రిక్ : (విషపు నవ్వుతో) హ...హ ...హ! పూర్ క్రీచర్ !

(వికటాట్టహాసాలు — తెర)

(Music bits)

## వ్యాఖ్యానం

రాజామహీపతిరామ్ వద్ద సేనాపతిగా ఉన్న అతని మేనల్లుడు శ్రీపతి రామ్ ఆ రాత్రే విలియం పామర్‌పై దాడిచేసి మామను విడిపించాడు. బ్రిటిష్ నియంతృత్వంపై తెలంగాణాలో ఈ విధంగా ప్రారంభమైన తిరుగుబాటు హైదరాబాద్ సంస్థానం మూల మూలలా వ్యాపించింది. నూరుల్ ఉమ్రా, రావు రంభా నింబాల్కర్, వెంకటప్ప నాయక్ వంటి జమీందార్లు జాగీర్దార్లే కాక అన్ని జిల్లాలోని సామాన్య జనానీకం కూడా విప్లవం జరిపింది. వరంగల్, ఖమ్మం, నల్గొండ ప్రాంతాల్లోని రైతాంగం, శ్రామిక వర్గం కూడా నిజాం ప్రభుతపై తిరుగుబాటు జరిపి తమ వంతు విప్లవోద్యమ స్ఫూర్తిని ప్రదర్శించాయి. హైదరాబాద్ రెసిడెన్సీ, కంటింజెంట్ వంటి ఎన్నో ప్రాంతాల్లోని ముస్లిం సైనికులూ, బహిష్కృత రోహిల్లా సైనికులూ బ్రిటిష్ సోల్జర్లపై విరుచుకు పడ్డారు. తెలంగాణాలోని భిల్లులూ, గోండులూ, హట్కర్‌లూ, బంజారాలూ కూడా తిరుగుబాటు చేశారు. హిందువులే కాక జహంగీర్ ఖాన్, మౌల్వీఅల్లా వుద్దీన్ వంటి ముస్లిం ప్రముఖులూ, తుర్రెబాజ్‌ఖాన్ వంటి రోహిల్లా వీరులూ సంస్థానం లోని ఉన్నత రాజోద్యోగులపై దాడులు జరిపారు. లెక్కలేనంత ధనక్షయం, జన క్షయం జరిగింది. ఈ సాయుధ విప్లవ ధోరణి దాదాపు నలభై సంవత్సరాల కాలం కొనసాగింది. ఆ తర్వాత పత్రికల ద్వారా, గ్రంథమాలల ద్వారా, గణపతి ఉత్సవాల ద్వారా శాంతియుతమైన స్వాతంత్ర్య ప్రబోధాన్నీ, ఉద్యమాన్నీ కొనసాగించారు, దేశంలోని ఎందరో ప్రముఖులు. నిర్భయంగా, నిస్సంకోచంగా ప్రచురించే యథార్థ వార్తలద్వారా, లేఖల ద్వారా, సంపాద కీయాలద్వారా ప్రజలను ఉత్తేజపరచే ఆనాటి పత్రికా రంగంపై క్రీ.శ 1891లో ప్రయోగింప బడిన రాజకీయ దమననీతి రూపమే "గస్తీ నిషాన్ — 53"

(Music Bits)

SCENE_3:

# షౌకతుల్ ఇస్లాం పత్రికకార్యాలయం దృశ్యం

(ముగ్గురు హిందువులు_ ఎడిటర్ హాజీకర్రాన్ కూర్చుని ఉంటారు)

హాజీకర్రాన్: ఈ గస్తీనిషాన్ తిర్‌పన్‌లోని షరతులు చూశారా వామన్ నాయక్‌గారూ!

వామన్‌నాయక్: చూశాను హాజీకర్రాన్ సాహెబ్! నేనేకాదు, నావెంట వచ్చిన ఈ మిత్రులు కూడా చూశారు. ఆవిషయం ప్రస్తావించడానికే మేమంతా మీ సంపాదకత్వంలో నడుస్తున్న ఈ షౌకతుల్ ఇస్లాం పత్రిక కార్యాలయానికి వచ్చాము.

శాస్త్రి:- ఇది చాలా అన్యాయం హాజీకర్రాన్ సాహెబ్!

హాజీకర్రాన్ - కాలమహిమ శాస్త్రీజీ! బ్రిటిష్ తొత్తుగామారిన నిజాం ప్రభుత్వం దివాన్ అస్మాన్‌జా సూచనతో, హోమ్ సెక్రెటరీ ఫతేనవాబ్ జంగ్ సహకారంతో చేసిన వాగ్బంధన శాసనం ఇది. దీనితో హైదరాబాద్‌లో పత్రికా స్వాతంత్ర్యంతో పాటు స్వేచ్ఛగా మాట్లాడే హక్కు కూడా పోయినట్టే.

పట్వారి :- గస్తీనిషాన్-53 విధించే 'ఎకరార్‌నామా' లో ఉన్న ఏడు షరతుల్లోనూ ప్రభుత్వ దమననీతే ప్రతిఫలిస్తున్నది. బ్రిటిష్ ప్రభుత్వానికి, నిజాం ప్రభుత్వానికి వ్యతిరేకంగా ఏదీ వ్రాయకూడదన్న తర్వాత ఇక పత్రికలు సాధించే పనిమాత్రం ఏమున్నది;

హాజీ:- బాగా చెప్పారు పట్వారీ సాహెబ్! ఈఎకరార్‌నామా ప్రభుత్వానికి సమర్పించని పత్రికలను, గస్తీనిషాన్-53 నిబంధనలు పాటించని నేరం కింద పోలీస్ కమీషనరే స్వయంగా వచ్చి జప్తుచేయాలని కూడా ఉత్తర్వు.

శాస్త్రి దక్కన్ పంచ్, హైదరాబాద్ గెజెట్" పత్రికలు ఈ ఎకరార్ నామా సమర్పించాయటకద కర్రాన్‌జీ?

హాజీ:- ఔను శాస్త్రీజీ! తక్కిన పత్రికలుకూడా ఇవ్వక తప్పదు.

వామన్‌నాయక్:- 1891 జూన్ 14 వతేదీనాటి మీ "షౌకతుల్ ఇస్లాం" 35 వ సంచిక అనుబంధంలో– ప్రభుత్వం ప్రకటించిన ఎకరార్‌నామాపై ప్రజాభిప్రాయాలను కోరుతూ మీరు ప్రచురించిన' బహిరంగలేఖ' చదివాను కర్తాన్ సాహెబ్! ప్రజలకు ప్రభుత్వం మీద గాని, ప్రభుత్వోద్యోగులమీద గాని దురభిప్రాయం కలిగించే వ్రాతలు వ్రాయకూడదన్న గస్తీ నిషాన్ ఏడవ షరతును లెక్క చేయకుండా ఆ లేఖను ప్రకటించిన మీకు నా అభినందనలు.

హాజీ : షుక్రియా వామన్ నాయక్‌జీ ! ఈ గస్తీనిషాన్-53 అమలు ద్వారా ప్రభుత్వం అనుసరిస్తున్న దమననీతిలోని ఉద్దేశ్యం ఏమిటో తెలుపమని కూడా పోలీస్ కమీషనర్‌కు ప్రత్యేకంగా ఒక లేఖ వ్రాశాను. ఏంజరుగుతుందో– పరిణామాలను ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉందాం.

(తెర)

(Music bits)

## వ్యాఖ్యానం

ఆ తర్వాత తెలంగాణాలో కొమర్రాజు లక్ష్మణరావుగారి నేతృత్వంలో "విజ్ఞాన చంద్రికా గ్రంథమండలి, శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం" హైదరాబాద్‌లో ప్రారంభమైనాయి. తెలంగాణా ప్రజల సర్వతోముఖాభివృద్ధికీ, ఆంధ్ర భాషా సాహిత్య సంస్కృతుల వికాసానికి ఉపస్కారకంగా మాడపాటి హన్మంతరావుగారి కార్యదర్శిత్వంలో "నిజాం రాష్ట్రాంధ్ర జనసంఘం" ఏర్పడింది. "ఆంధ్ర జనసంఘం" పేరుతో ఇది ప్రసిద్ధి కెక్కింది దీనికి అనుబంధంగా "లక్ష్మణరాయ పరిశోధక మండలి" ఏర్పడింది. ఈ సంఘ కార్యకలాపాల ఫలితంగానే ఆ తర్వాతికాలంలో హైదరాబాద్‌లో "ఆంధ్ర సారస్వత పరిషత్తు" ఆవిర్భవించింది. హైదరాబాద్ 'గోల్కొండ పత్రిక', మానుకోట 'తెలుగుపత్రిక', నల్గొండ 'నీలగిరి పత్రిక' ఈ సంఘం లక్ష్యాలను ప్రచారం చేశాయి. పులిజాల రంగారావు, టేకుమాల రంగారావు,బూర్గుల రామకృష్ణరావు, సురవరం ప్రతాపరెడ్డి, కొండా వెంకట రంగారెడ్డి, ఆదిరాజు వీరభద్రరావు ప్రభృతులు కాంతియుతమైన ఈ సాంస్కృతీ వికాసానికి దోహదం చేశారు. స్వాతంత్ర్యోద్యమ లక్ష్యంతో, నిజామ్ నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా "హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్" ప్రణాళిక ఆవిర్భవించింది.

(Music Bits)

# సర్ అక్బర్ హైదరీ భవన దృశ్యం

(దివాన్ అక్బర్ హైదరీ ఎదురుగా గోవిందరావు నానల్, మందుముల నర్సింగరావు కూర్చొని ఉంటారు. దివాన్ పి.ఏ. చేతులు కట్టుకొని నిలబడి ఉంటాడు)

హైదరీ : కార్యాచరణ అధ్యక్షులుగా మీరు నడుప దలచిన స్టేట్ కాంగ్రెస్ కొనసాగదు గోవిందరావ్ నానల్ జీ!

గోవిందరావ్:- ఎందుచేత దివాన్ సర్ అక్బర్ హైదరీగారూ?

హైదరీ:- మత పాక్షిక దృష్టితో ఉన్నది కాబట్టి, అది 'ఫిర్ఖేవారీ' అనీ, హైదరాబాద్ వెలుపల ఉన్న నేషనల్ కాంగ్రెస్ అనుబంధ సంస్థ కాబట్టి, అనుమతించ కూడదనీ మన నిజామ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహద్దర్ వారి నిర్ణయం. భారతదేశం మొత్తంమీద జరుగుతున్న పోరాటం వల్ల ఒకవేళ దేశానికి స్వాతంత్ర్యం వచ్చినా కూడా, స్వతంత్రదేశంగా "ఆజాద్ హైదరాబాద్" ఉండాలనే ఆశయంతో ఉన్న మేము మీసంస్థ ఆవిర్భావాన్ని హర్షిస్తామనే అనుకుంటున్నారా?

గోవిందరావ్:- దివాన్‌గారూ! హైద్రాబాద్ స్టేట్ కాంగ్రెస్ మతసంస్థ కాదు. ఇది ఒక జాతీయ సంస్థ. అభ్యుదయభావాలతో రాష్ట్రాభివృద్ధి జరగాలని కోరుకునే సంస్థ. ఈ సంస్థ ఆసఫ్‌జాహీ రాజవంశానికి పూర్తి విధేయత ప్రకటిస్తుంది. కాబట్టి ఇది ఒక కమ్యూనల్ సంస్థ అని మీరు భావించకూడదు. హైదరాబాద్ రాజ్యాంగానికి మా సంస్థ తల పెట్టిన ద్రోహం ఏమీలేదు.

హైదరీ:- ఐతే, ఈ సంఘస్థాపనలో కుటిల రాజకీయ లక్ష్యాలు ఏమీలేవంటారు? అదే నిజమైతే -కేవలం తెలంగాణావారి భాషా సాహిత్య సాంస్కృతిక రంగాల వికాసానికి మాత్రమే పరిమితమైన "నిజాంరాష్ట్రాంధ్ర జన సంఘం" ఎందుకు "ఆంధ్ర మహాసభ"గా పరిణమించింది? 1937లో నిజామాబాద్‌లో జరిగిన 6వ ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా ఉన్న ఈ మందుముల నర్సింగరావుగారు "బాధ్యతాయుత ప్రభుత్వస్థాపనమే" నిజాంరాష్ట్రాంధ్ర జనసంఘం ఆదర్శమనే అర్థంవచ్చే తీర్మానం

ఎందుకుచేశారు? మీరు తలపెట్టిన ఈ స్టేట్ కాంగ్రెస్ ఉద్యమానికి ఆంధ్రమహాసభ ప్రముఖనాయకులైన రావి నారాయణరెడ్డి, మందుముల రామచంద్రరావు, ఈ మందుముల నర్సింగరావు వంటివారు ఎందుకు వ్యక్తిగతమైన మద్దతు ఇస్తున్నారు? నిజాం ప్రభుత్వానికి ఈమాత్రం అర్థం కాదనుకుంటున్నారా?

గోవిందరావ్:- అదికాదు దివాన్‌గారూ! 1932లో లండన్‌లో జరిగిన రౌండ్ టేబుల్ సమావేశం హైదరాబాద్ వంటి దేశీయ సంస్థానాల్లోని ప్రజలకు ప్రాథమిక హక్కులివ్వాలనీ, ప్రజాప్రాతినిధ్యానికి సంబంధించిన మూల సూత్రాలను అన్వయింపచేయాలనీ తీర్మానించింది కదా! దానికి అనుగుణంగానే కదా, ఆనాడు హైదరాబాద్‌లో కుమారి పద్మజానాయుడు ఆధ్వర్యంలో "స్వదేశీలీగ్" ప్రారంభమైంది? రౌండ్‌టేబుల్ సమావేశం నిర్ణయాలతో, స్వదేశీలీగ్ ఆశయాలతో ఏకీభవిస్తూ - బాధ్యతాయుత ప్రభుత్వ స్థాపనకూ, స్వాతంత్ర్యోద్యమాన్ని నిర్వహించడానికీ, తత్ఫలితంగా ఏర్పడబోయే ఇండియన్ యూనియన్‌లో హైదరాబాద్ నేటివ్ స్టేట్ విలీనమయ్యే ప్రయత్నం చెయ్యడానికి స్టేట్ కాంగ్రెస్ పూనుకుంటున్నది? ఇంతటి మహోన్నత రాజకీయలక్ష్యాలతో ఏర్పడబోయే హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను మీరెందుకు హర్షించరు?

హైదరీ : ముమ్మాటికీ హర్షించం గోవిందరావ్‌జీ. ఇండియన్ యూనియన్‌లో కలిసే ఉద్దేశ్యమే మాకు లేదుకదా? ఈ విషయం మీరు స్పష్టంగా గుర్తిస్తే మంచిది. ఈ సర్ అక్బర్ హైదరీ ప్రధానమంత్రిగా ఉన్నంత వరకూ, అసఫ్‌జాహీ పరిపాలనలో ఉన్న ఈ హైదరాబాద్ సంస్థానంలో మతపక్షపాతపూర్వకమైన మీ ప్రయత్నం కొనసాగదు. స్టేట్ కాంగ్రెస్‌కు అనుమతి దొరకదు. దాన్ని నిషేధిస్తూ నిజామ్ జారీచేసిన ఉత్తర్వును వినండి.

(పి.ఏ. వైపు చూస్తాడు. వంగి సలాములు చేస్తూ టేబిల్‌మీది ఒక ఫైల్ తీసి, విప్పి చదువుతాడు పి.ఏ.)

పి. ఏ. : "నిజామ్ ప్రభుత్వం ఏ రాజకీయ సంస్థను స్థాపించటాన్నీ ఆక్షేపించదు. ఐతే అది పూర్తిగా మత పక్షపాత రహితమై ఉండ వలెను. బయటి సంస్థలతో దానికి సంబంధం ఉండకూడదు. ఈ సంస్థను స్థాపించదలచినవారు మొదట ఆత్మ పరిశోధన చేసుకోవలసి ఉన్నది. వారు రాజకీయాల ముసుగు వేసుకొని మత పక్షపాతచర్యలకు పూనుకోవాలనుకుంటున్నారు. అందువల్ల రాజ్యంలో తలపెట్టిన రాజ్యాంగ సంస్కరణలు కుంటుపడతాయి. 'కాంగ్రెస్' అని పేరుపెట్టు కొని, దాని కీర్తి గౌరవాలను దురుపయోగపరచ దలుచుకున్నారు. కాబట్టి ఏర్పడబోయే హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌ను నిషేధించవ మైనది."

గోవిందరావ్: "జాతిమతవిచక్షణలేకుండా హైదరాబాద్ సంస్థాన పౌరులందరూ సభ్యులుగా చేరడానికి అర్హులు" అన్న స్టేట్ కాంగ్రెస్ మానిఫెస్టోలోని ప్రధాన సూత్రాన్నే మీరు పరిగణించలేదు. ఎనిమిదేండ్లుగా నిజామ్ ప్రభుత్వోద్యోగిగా ఉన్న సిరాజుల్ హసన్ తిర్మజీ మాలో చేరడం లోని మతరహిత దృక్పథాన్ని మీరు గమనించలేదు. కాంగ్రెస్ ముసుగులో మత పక్షపాత వైఖరికి స్టేట్‌కాంగ్రెస్ పాల్పడబోతున్నదనే మీ ఆరోపణ హాస్యాస్పదం. ఈ ప్రజా వ్యతిరేక వైఖరి మారడానికి మేమం దరం చిత్రహింసలు భరించైనా సరే, శాంతియుతంగా సత్యాగ్రహం చేస్తాం. "అజాద్ హైదరాబాద్" సంకల్పమే ప్రమాదకరం. కాబట్టి హైదరాబాద్ నేటివ్ స్టేట్‌ను స్వాతంత్ర్యోద్యమ ఫలితంగా ఏర్పడ బోయే ఇండియన్ యూనియన్‌లో కలిపివేసే వరకూ మేము విశ్ర మించం. ఇది నిశ్చయం. ముమ్మాటికీ నిశ్చయం.

(తెర)

(Music bits)

## వ్యాఖ్యానం:

హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ నిషేధానికి నిరసనగా 1938 నుండి 1946 వరకూ సత్యాగ్రహాలూ, నిజాంవ్యతిరేక పోరాటాలూ నిరంతరంగా సాగాయి. గోవిందరావ్ న్యల్ ఆధ్వర్యంలో జనార్ధన్‌శాయి, రామ్‌కిషన్ దూత్, వసంతరావ్ బోరీకర్, రావి నారాయణరెడ్డి ప్రభృతులు తెలంగాణా, కర్ణాటక, మహారాష్ట్ర ప్రాంతాల ప్రతినిధులుగా 1938 అక్టోబర్ 24వ తేదీ దీపావళిరోజున ఉదయం పదిగంటలకు హైద్రాబాద్ సుల్తాన్ బజార్ టెలిగ్రాఫ్ ఆఫీస్ వద్ద సత్యాగ్రహం చేశారు. అందర్నీ అరెస్ట్ చెయ్యడం జరిగింది. ఆ వెనువెంటనే మరో మూడు రోజులకు అంటే 1938 అక్టోబర్ 27వ తేదీన స్వామీరామానంద తీర్థ నేతృత్వంలో కెప్టెన్ వెంకటేష్‌జోషీ, అప్పారావుసేత్కర్, రాఘవేంద్రరావు, రాజారెడ్డి ప్రభృతులు సత్యాగ్రహంచేసి బంధితులయ్యారు. ఈ సత్యాగ్రహాలకు మద్దతుగా అప్పటి తెలంగాణా 16 జిల్లాల్లోనూ పండిత్ నరేంద్రజీ, తెలంగాణా ఉక్కు-మనిషి జమలాపురం కేశవరావు, టి. హయగ్రీవాచారి, మాడపాటి రామచంద్ర రావు, కోదాటి నారాయణరావు, బొమ్మకంటి సత్యనారాయణరావు, కాళోజీ నారాయణరావు, పాగా పుల్లారెడ్డి, ఎం. ఎస్. రాజలింగం, కొండా లక్ష్మణ్, కాటం లక్ష్మినారాయణ, దిగంబర్ రావు బిందూ, ఎన్. కె. రావు, హరిశ్చంద్ర హెడా, మందుముల రామచంద్రరావు, శ్రీమతి ఎల్లాప్రగడ సీతాకుమారి, ప్రేమ్‌రాణి యాదవ్, ఆరుట్ల లక్ష్మినరసింహరెడ్డి, కె. వి. నరసింగరావు కొత్తూరు సీతయ్యగుప్త, జలగం వెంగళరావు హైదరాబాద్ "పత్రిక" నడిపిన శ్రీ మర్రి చెన్నారెడ్డి, శ్రీమతి సావిత్రిచెన్నారెడ్డి, దామోదర్ పాంగ్రేకర్ బాజీ కిషన్‌రావు, శ్రీమతి విమలాబాయి మేల్కోటే, శ్రీమతి జ్ఞానకుమారి హెడా, పన్నాలాల్ పిత్తి వంటి స్వాతంత్ర్య సమరయోధులు ఉధృతంగా సత్యాగ్రహాలుచేసి - అనేక కష్టనష్టాలకు గురై కొందరు, అరెస్టై కొందరు పోరాటం సాగించారు. హిందువులేకాక "షోహబుల్లాఖాన్, బాఖర్ అలీమీర్జా, ఫరీద్ మీర్జా' హుసేన్ అబ్దుల్‌మునీం, మహమ్మద్ హుసేన్‌జాఫరీ, ముల్లా అబ్దుల్ బాసిత్' అహ్మద్‌మీర్జా వంటి ముస్లింలు కూడా నైజాం విధానాలమీద తిరుగుబాటు చేశారు. ప్రజాకవి కాళోజీతో పాటు దాశరథి కూడా "రుద్రవీణలు మీటి, అగ్నిధారలు కురిసి—మా నిజాంరాజు జన్మ జన్మాల బూజు" వంటి ప్రజా విప్లవ కవితలతో నిజాంపై నిరసనోద్యమాన్ని ప్రకటించి జైలు పాలయ్యారు.

ఈ సత్యాగ్రహాలకూ, నిరసనలకూ సమాంతరంగా సాగిన మరొక మహోద్యమం "వందేమాతరం ఉద్యమం." తెలంగాణా పాఠశాలల్లో ప్రతిరోజూ తరగతులు ప్రారంభం కావడానికిముందు నిజాంను కీర్తిస్తూ ఉర్దూలో ప్రార్థనా గీతం పాడటం జరిగేది. దీన్ని నిరసించి ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని పి. వి. నరసింహారావు, అచ్యుతరెడ్డి, నూకల రామచంద్రారెడ్డి, సర్వదేవభట్ల రామనాథం, ఎస్. చెన్నారెడ్డి, బి. లక్ష్మీకాంతరావు, లక్కినేని నరసయ్య వంటి దాదాపు 350 మంది విద్యార్థులు ప్రతి ఉదయం వందేమాతర గీతం పాడటం ప్రారంభించారు. ఈ విద్యార్థులందరినీ ఉస్మానియా విశ్వవిద్యాలయం నుండి బహిష్కరిస్తూ, వీరికి దేశంలోని ఏ విశ్వవిద్యాలయంలోనూ అడ్మిషన్ ఇవ్వకూడదని ఇంటర్ యూనివర్సిటీ బోర్డును కోరింది నిజాం ప్రభుత్వం. కాని ఈ ఉద్యమం తెలంగాణాలోని పల్లెపల్లెలా వ్యాపించింది. ఈ గీతం పాడే సత్యాగ్రహులతో జైళ్ళు నిండిపోయాయి. ఒక బ్యారక్‌లోని ఖైదీలు 'వందే మాతరం' అనగానే తక్కిన బ్యారక్‌లన్నీ ఆనినాదానికి తమవంతు ప్రతి నినాదాలు చేశాయి. కొందరిని శిక్షిస్తే తక్కినవారు మానుతారని ఆలోచించింది నిజాం ప్రభుత్వం. ఆ చర్యలో భాగంగా ఉత్సాహ వంతుడైన ఆర్యసమాజ్ కార్యకర్త వావిలాల రామచంద్రరావును 'వందేమాతరం' అన్నప్పుడల్లా కొరడాతో కొట్టారు. కొరడాదెబ్బలు తింటూ స్పృహతప్పే వరకూ, 'వందే మాతర' నినాదం ఆగకుండాచేసిన ఆ వీర కిశోరుడు "వందేమాతరం రామ చంద్రరావు''గా చరిత్రలో నిలిచిపోయాడు.

ఎనిమిదేళ్ళపాటు నిరంతరంగా సాగిన ఇలాంటి ఉద్యమాల ఫలితంగా, తెలంగాణా ప్రజాయోధుల విజృంభణకు అదిరిపోయి చిట్టచివరికి దిగిరాక తప్ప లేదు నిజాం ప్రభుత్వానికి. స్టేట్ కాంగ్రెస్‌మీది ఆంక్షతొలగి పోయింది. స్వామీ రామానందతీర్థ హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ అధ్యక్షులయ్యారు. మాదపాటి రామచంద్రరావు కార్యదర్శిత్వంలో ఆంధ్రమహాసభ, మహారాష్ట్ర, కర్ణాటక పరిషత్తుల్లో పనిచేస్తూన్న వేలాదిమంది కార్యకర్తలు హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్‌లో చేరిపోయారు.

1947 మే నెలలో హైదరాబాద్ స్టేట్ కాంగ్రెస్ మహాసభ జరిగింది. సోషలిస్టు వర్గానికి ప్రతినిధిగా శ్రీమతి కమలాదేవి చటోపాధ్యాయ, కర్ణాటక ప్రాంతంనుండి నిజలింగప్ప, ఆ సభలకు హాజరైనారు. అదిగో ఆ మహాసభలను ప్రారంభిస్తూ స్వామీ రామానందతీర్థను అభినందిస్తున్నారు అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ శంకర్‌రావ్‌దేవ్.

(వందేమాతరం — Music Effects)

SCENE : 5

# ఒక సమావేశ దృశ్యం

(శంకర్‌రావ్‌దేవ్, కమలాదేవి చటోపాధ్యాయ, నిజలింగప్ప, స్వామి రామానందతీర్థ, మాడపాటి రామచంద్రరావు, ఎన్. జి. రంగా, బూర్గుల రామకృష్ణారావు వేదికమీద కూర్చొని ఉంటారు. సభలో హిందువులూ, ముస్లిములూ ఆసీనులై ఉంటారు).

శంకర్‌రావ్‌దేవ్ (లేచి నిలబడి) : మిత్రులారా ! నిజాం నిషేధ ఉత్తర్వు తర్వాత స్వామి రామానంద తీర్థగారు స్టేట్ కాంగ్రెస్ ప్రారంభానికి ఊతగా నిర్వహించిన సత్యాగ్రహానికి, వందేమాతరం ఉద్యమానికి విశ్వకవి రవీంద్రుడూ, జాతినేత గాంధీజీ, నెహ్రూ వంటి స్వాతంత్ర్యోద్యమ నాయకులెందరో తమ సానుభూతి సందేశాలు పంపి ప్రోత్సహించిన సంగతి మీకందరికీ తెలుసు. గత్యంతరం లేక చివరికి 1946 జూన్ 3వ తేదీన నిజాం ప్రభుత్వానికి తాను పెట్టిన ఆంక్ష తొలగించవలసి వచ్చింది. స్టేట్‌కాంగ్రెస్‌కు జరిగిన ఎన్నికల్లో స్వామి రామానందతీర్థగారే అధ్యక్షస్థానాన్ని అలంకరించడం మనం దరికీ ముదావహం. ఇప్పుడు రామానందతీర్థగారు ప్రసంగిస్తారు.

రామానందతీర్థ:- (లేచి నిలబడి) మిత్రులారా! మీకందరికీ స్వాగతం! ఈ మహాసభలను ప్రారంభించిన అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి శ్రీ శంకర్‌రావ్‌దేవ్‌గారికి సభ నలంకరించిన మీ కందరికీ నమస్సులు. ఈ సమావేశానికి ప్రత్యేక అతిథులుగా విచ్చేసి వేదిక నలంకరించిన శ్రీ నిజలింగప్పగారికీ, శ్రీ కమలాదేవి చటోపాధ్యాయ గారికీ, శ్రీ ఎన్. జి. రంగాగారికీ, కృతజ్ఞతాభివందనములు. నిజాం ప్రభుత్వం తన నిషేధాజ్ఞను రద్దుచేసుకోవడమే మన ఘన విజయం. ఆజాద్ హైదరాబాద్ ప్రతిపాదనపై నిజామ్‌కు నిరసన తెలిపే సందేశాన్ని మీ అందరి ఆమోదముద్రకోసం చదువవలసిందిగా శ్రీ బూర్గుల రామకృష్ణరావును కోరుతున్నాను.

బూర్గుల: (లేచి నిలబడి) "స్వాతంత్ర్యోద్యమ ఫలితంగా బ్రిటిష్ సార్వభౌమాధికారం అంతరిస్తే, ఆ తర్వాత దహైదరాబాద్ స్వతంత్ర భారతదేశంలోని ఏ 'కానిస్టిట్యుఎంట్ అంసెబ్లీ' లోనూ చేరదనీ, తాను స్వతంత్ర

ప్రతిపత్తిగల రాజుననీ నిజామ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ అభిప్రాయ పడడం దురదృష్టకరం. హైదరాబాద్ నేటివ్ స్టేట్ ఇండియన్ యూనియన్‌లో చేరకపోతే ప్రజాభ్యుదయ దృష్టితో బలహీనం కాక తప్పదు. కాబట్టి ప్రగతినిరోధకమైన నిజాం ప్రభువు ప్రజావ్యతిరేక భావాలను గర్హిస్తున్నాం". ఇది మన ప్రతిపాదన పాఠం. ఏ ఉద్యమానికైనా ప్రచారం అవసరం కాబట్టి మన నిర్ణయాన్ని ప్రతిబింబించే ఒక సందేశాన్ని నేషనల్ కాంగ్రెస్ నాయకులకూ, భారత దేశంలోని అన్ని ప్రాంతాలకూ, అమెరికాలోని ప్రజానాయకులకూ, యూరప్‌లోని అందరు ప్రజాస్వామ్య ప్రభుత్వాధి నేతలకూ పంపించే ఏర్పాటు జరిగింది. ఆకేబుల్ సారాంశం ఇది — "నిజాంరాష్ట్ర ప్రజలు ఫ్యూడల్ రాచరిక పరిపాలనక్రింద నలిగిపోతూ, వాక్స్వాతంత్ర్యాన్నీ, భావస్వాతంత్ర్యాన్నీ కోల్పోయి పశుతుల్యులుగా చూడబడుతున్నారు. దీనికి వ్యతిరేకంగా హైదరాబాద్ సంస్థానం నేడో రేపో ఉదయించబోయే ఇండియన్ యూనియన్‌లో కలిసిపోవాలనే ఉద్యమంతో ఇక్కడి ప్రజలు శాంతిసమరం సాగిస్తున్నారు. ఈ సమరాన్ని ప్రతిఘటించడానికి నిజాం పోలీసులు ఎంతటి కిరాతక రాక్షస చర్యలకైనా పాల్పడే అవకాశం ఉన్నది. ప్రజాస్వామ్య దేశాధినేతలైన మీరు ఈప్రజా విప్లవంలో మాకు నైతిక సహకారాన్ని అందజేస్తారని ఆశిస్తున్నాము."

(చప్పట్లు)

(రంగంమీద చీకటి. పోలీసుల బూట్ల ధ్వని, రైఫిల్ ఫైరింగ్ ధ్వని)

**పోలీస్ కమీషనర్ గొంతు: సిపాహియో‌! ప్రజావిప్లవాన్ని రేకెత్తించడానికి ప్రయత్నిస్తున్న ఈ స్వామీజీనీ, అతని అనుయాయులందరినీ అరెస్టుచేయండి.**

(లాఠీ చప్పుళ్ళు)

ప్రజలు: ఇది అన్యాయం, అక్రమం.

కమీషనర్: వాళ్ళతోపాటే మద్దతునిచ్చే ఈ గొర్రెలను కూడా కట్టి పడవేయండి.

ప్రజలు: నిజాం ఫ్యూడల్ రాచరిక వ్యవస్థ నశించాలి. హైదరాబాద్ ఇండియన్ యూనియన్‌లో కలిసిపోవాలి!

వందేమాతరం — వందేమాతరం — వందేమాతరం!

(లాఠీల చప్పుళ్ళు - ఫైరింగ్ ధ్వనులు - Unrest వాతావరణం - Sound Effects)

(తెర)

(Music bits)

## వ్యాఖ్యానం

1947 ఆగస్టు 15 అర్ధరాత్రి ఢిల్లీ ఎర్రకోటపైన స్వతంత్ర భారత పతాకం ఎగిరింది. తెల్లవాళ్ళ బ్రతుకు తెల్లవారింది. ప్రభుత్వాధికారం దేశీయులకు దత్తమైంది. అన్ని స్వదేశీ సంస్థానాలూ ఇండియన్ యూనియన్‌లో విలీనమయ్యాయి. ఒక్క నిజామ్ మాత్రమే "ఆజాద్ హైద్రాబాద్" ప్రక

టించి, ఇండియన్ యూనియన్‌లో చేరక, తనను ప్రతిఘటించిన సంస్థాన ప్రజలను చిత్రహింసల పాల్జేశాడు. స్టేట్ కాంగ్రెస్ తరఫున స్వామీ రామానంద తీర్థ పిలుపునందుకొని సర్దార్ జమలాపురం కేశవరావు, బద్దం ఎల్లారెడ్డి, ఎన్. కె. రావు, మందుముల రామచంద్రరావు ప్రభృతులు హైదరాబాద్ సంస్థానంలోని అన్ని ప్రాంతాలనుండీ ప్రజావిప్లవం లేవదీశారు. స్వతంత్ర భారతనాయకులకు సందేశాలు పంపించారు. తత్ఫలితంగా ఉక్కుమనిషి సర్దార్ వల్లభ్‌భాయిపటేల్ ఆదేశానుసారంగా మేజర్ జనరల్ జె. ఎన్. చౌదరి నాయకత్వంలో 1948 సెప్టెంబర్ 13న హైదరాబాద్ నేటివ్ స్టేట్‌పై పోలీసు చర్య ప్రారంభమైంది.

(Police Action - Music Effects)

ఢిల్లీ ఎర్రకోటపై ఆసఫియా పతాకం ఎగురవేస్తాననీ, హైందవ రక్త సిక్తమైన కత్తులు బంగాళాఖాతంలో కడుగుతాననీ ప్రగల్భాలు పలికిన నిజాం కుడిభుజం ఖాసిం రజ్వీ కిరాతక చర్యలు అంతరించాయి. నిజాం ఫ్యూడల్ వ్యవస్థ హైదరాబాద్ నేటివ్‌స్టేట్‌లో అడుగంటింది. అదిగో హైదరాబాద్ నగరంమీద త్రివర్ణ భారతకేతనం తన చల్లని నీడను ప్రసరిస్తున్నది.

(వీలైతే వల్లభ్‌భాయ్ పటేల్ ఉపన్యాసం—Sound Track)

(National Anthem — Music Effects)

SCENE : 6

# బుర్రకథ

కథకుడు:- జయము జయము మన భారతజాతికి జయము దిగ్విజయము

వంతలు:- తందానతాన

కథ : జయము తెలంగాణా స్వాతంత్ర్యం తెచ్చిన వీరులకు ॥తందాన॥
జయము తెలంగాణా స్వాతంత్ర్యం తెచ్చిన వీరులకు ॥తందాన॥
మూడురంగుల జాతి పతాకకు జయము దిగ్విజయము ॥తందాన॥
అరెరే - మూడు కాలముల వెలిగే జెండకు జయము దిగ్విజయము ॥తందాన॥
అరెరే - మూడులోకముల నిండిన ఖ్యాతికి జయము దిగ్విజయము ॥తందాన॥
అరెరే - పాడిపంటలకు పౌరుషాగ్నులకు పెన్నిధి ఈ జెండా ॥తందాన॥
అరెరే - మూడు వన్నెలా ఇంద్రధనుసురా ముచ్చటైన జెండా ॥తందాన॥
ఈ - జెండా ఎత్తిన జాతిచేతులకు జయము దిగ్విజయము ॥తందాన॥
కథ : వినరా భారత వీరకుమారా వీర విజయయాత్ర ॥తందాన॥
స్వాతంత్ర్యోద్యమ యజ్ఞదీక్షలో తెలంగాణ పాత్ర ॥తందాన॥
వినరా భారత వీరకుమారా వీర విజయయాత్ర ॥తందాన॥
స్వాతంత్ర్యోద్యమ యజ్ఞదీక్షలో తెలగాణ పాత్ర ॥తందాన॥

వంతలు:- తందానతాన — తా తకిటతరి తరికిట జంతరి తా

(తెర)



కూర్చున్నవారు :

శ్రీయుతులు స్వామి రామానందతీర్థ, గోవిందరావునానక్, రావి నారాయణరెడ్డి.

మధ్యవరుస :

మద్దాల అంతయ్య, గార్లపాటి రాఘవరెడ్డి, కాళోజీ నారాయణరావు, అంబ
టి. హయగ్రీవాచారి, పొట్లపల్లి రామారావు, ఒగ్గయ్య, ఇందేరావు.

పై వరుస :

బాలరాజు, చక్రపాణి (క్రీ.శ. 1938)